గీ. చీఁకటియు గొందులందూఱె, ఘూకతతికి
భయమునుం దోటుపాటు నేర్పడియె, నాల్గు
దెసలు తెలుపెక్కె, దోఁచె నద్దినకరాంశు
జాలములు బంగరువుచాళ్ళ చాయ నంత. 3

ఉ. రాత్రి గతించె నెట్లొ; దిన
రా జుదయాద్రినిఁ గొల్వు దీరెఁ, బ్రా
భాత విచిత్రచిహ్నములు
భాసిలె దిక్కుల, నంత నాతఁడు
స్నాతులగేహసీమకు గ్ర
మంబుగఁ బైనమొనర్చి యందు రా
మాతిలకంబు భార్య గల
మాటఁ దలంచుచు మోద మొందుచున్. 4

గీ. తగ నుషఃకామినీ మహోద్వాహవేళఁ
జల్లికొను నెత్తు బుక్కాము సొరుపువీటఁ
దనదు తనుకాంతి క్రొక్రొత్త తళుకొనంగ
నరుణరుచితోడ నలరె నయ్యరుణరోచి. 5

ఉ. రాజితదేహుఁ డౌచు దిన
రాజు జగంబును బ్రోవరాఁగ నీ
రేజవధూటి యాతని వ
రింపను మిక్కిలి ప్రేమతోడ నీ

రాజన మించి, భర్మమణి
రాజిలతాసుమహారపాళి వి
భ్రాజిత కంఠ దేశమున
వైచె ననం గిరణాళి యొప్పెడిన్. 6

మ. అది కార్చిచ్చులు రేగు వేసవి; జలం
బహ్రిప్త, మాశావధూ
వదనంబుల్ వడదాఁకె, భానురుచి తీ
వ్రింబయ్యె, నా మేఘసం
పద యే దేశము పారిపోయె, ధనికా
వాసంబుల న్వట్టివే
శ్మదడుల్ వేంిలఁ దాడంగె, క్రింజిగురు కా
లంబయ్యె చూతాళికిన్. 7

సీ. వడగాలి పోఁతకు వడఁ గొనియుంగూడ
నెండమావుల స్వారి నిచ్చగించు
చెమట చిత్తడిచేత సిల్గు చెందియుఁగూడ
సుడిగాడుపుల వింతఁ జూచుచుండు
కటికు టెండను బిట్టు గదలుచుండియు మేటి
గాములపేనితోఁ గలియఁగోరు
దాహంబుచే నాల్క తడియారియున్ మించి
ప్రకృతి గీతావళిఁ బాడుచుండు
గీ. భయముఁ బుట్టించు సత్త్వశబ్దాల వినుచు
నబ్బురముఁ జెందు, స్నేహింప నలరుచుండు

కన్నులంజూచు బ్రీతి దానిఁ గర్జ మనుచు
తనవిగా నెంచి గాంచు సత్కవి యతండు. 8

గీ. కష్టమనఁబోడు సౌఖ్యంబుఁ గాదనండు
తన్మయత్వాన దిరుగాడు తలఁపుతోడ
మందమందంపు గమనాన మానసంబుఁ
బ్రకృతి చిత్రాలపైనుండి సుకవి నడచు. 9

సీ. పండుటాకులఁ జూచి పకపకనవ్వేడు
కిసలయమార్ధ్వ రక్తిమ మెఱింగి
అవని వైపునఁ జూచి యశ్రువుల్ విడచు నూ
సరవెల్లి మార్పు విషయ మెఱింగి
తూలుచు తోలు వాతూలంపు బెనుపరా
క్రమమును తజ్జనుగతుల నెఱిఁగి
కొండగుహాల దాఁగి కులుకుచు నవ్వించు
ప్రతిశబ్ద సఖుని భావం బెఱింగి

తోఁఱఁగు కన్నీటఁ దడపుచు ధరణియెల్ల
ధవుని దర్శింపఁ దిరుగు పతంగిహృదయ
తాపమునఁ గుంది తన యాత్మతన్వి యుల్లె
మొదరునని యెంచి పయనంబు వడి నొనర్చు. 10

చ. అలసటఁజెంది చెంది పథ
మందొక దీర్ఘికఁ గాంచి తత్సుధా
జలములఁ గ్రోలి కొంతవడి
చక్కగ నిద్దురవోయి లేచి ని

మ్మశేమగ సాఁగి సాగి యట
మార్గమునందునఁ దోఁచు చిత్రముల్
గలయఁగఁ జూచుచుణ్ మదికి
గంపము సంతసముణ్ జనింపఁగణ్. 11

చ. పడమటి జవ్వని న్నిశిత
భానుఁడు ప్రేముడిఁ జేరఁబోయె న
య్యెడ; మన సత్కవీంద్రుఁడును
నీ యెడ మామగృహంబునందు నుం
డెడి తన ధర్మపత్నిని గ
డింది ముదంబునఁ గాంచు కూర్మి న
ప్పుడె ధనదాపురంబునకుఁ
బోయెను నెన్నడు పోకపోకయుణ్. 12

చ. అతుల యశోవిహారుఁ డగు
నల్లుని రాకకు సంతసించి, స్వా
గత మిడి, క్షేమవార్తలను
గ్రచ్చుఱ ముచ్చటదీఱఁ బల్కి నం
చితమతులైన స్యాలకులు
చెల్వను గన్న పడంతి బాంధవుల్
గుతుకముమీఱ ముచ్చటలఁ
గొండొక కాలముఁ జేర్చి రాతనిణ్. 13

గీ. హృదయపాత్రాన తొలుకాడు ప్రేమరసము
వెలికి జాల్గట్ట నయ్యాత్మవిభుని పాద

పంకజయుగంబు తద్రస ప్లావనంబు
గా నొనర్చి నివాళి త త్కాంత యొసఁగె. 14

గీ. నల్లగల్వలఁబోలు కన్నవల నుండి
పొడమి యానందధార లుప్పొంగిపొంగి
పైకిరాఁ జూడఁగా మనోభావములను
మృదుల భాషణముల వచియించె నింతి. 15

గీ. ప్రకటమేఘోదయంబు చాతకము వోలె
పశ్చిమాంగన యను రాక భ్రమసి కోర
తన్మనోభీష్ట సిద్ధికై తరలె ననఁగ
సరసిజాప్తుఁడు పశ్చిమాచలముఁ జేరె. 16

చ. వలఁగొని చిమ్మ చీఁకటులు
పర్వెను దిక్కుల వింతవింతగాఁ
బులుఁగులు జంటలై మురిప
పుం బసిపిల్లలఁ జూచు కాంక్షతో
నలసి కులాయముల్ దరికి
నాతురతం జనె, భీరుచిత్తముల్
గలఁచె నిశీథదేవి యధి
కారపుదండముఁ జూపె రోదసిన్. 17

ఉ. మాడకుమాడ యెత్తుగల
మాటలతోఁ బ్రియభోజనాలతో
నాడెపు చూపుతోఁ గని మ
నంబునఁ దృప్తి జనించునట్లుగన్

వేడుక నెల్లవారు కవి
పేరునికిఁ బనుగుడుపుఁ జేసిరా
మూఁడు దినాలు స్వర్గమిది
పో యని యాతఁడు వాంగి తేరఁగా. 18

గీ. మూఁడుదినములు సన నల్లుతోడ నత్త
వారు తమరాక కేమని ప్రశ్న వేయఁ
దనదు నపచార కార్యంబు జనకుఁడొసఁగ
నట్టి శాపోక్తి యంతయు నతఁడు దెల్పె. 19

గీ. మూతివిఱిచిరి ప్రేమసముద్ర భంగ
ములకు భంగంబు ఘటియిల్లె ముదము చెదరె
వ్రేలుమడచిరి యున్నదినాల నెంచి
యత్తగారింట నలజడి యంకురించె. 20

మ. దినముల్ దాటు కొలంది. యాదరము నెం
తేఁ దగ్గఁగాఁ జొచ్చె, భో
జనపానాది విధాలు మారినవి మ
ప్పాకాపత్యముల్ రేఁగి, నం
జనితామోద వినూత్న భావములు నా
శంబొందె కొన్నాళ్ళకే,
ఘనుఁడౌ నల్లుని కింక, లాతుల కెటుల్
గావచ్చు నత్తింటిలో ?

చ. గుసపముఁదట్టు చేతి కిడి
గుంటలు దప్పివ్వఁగ బావమర్దు లా
జ్ఞను నిడ, దానినెంతొ శిర
సావహింయించి యొనర్చు; గంటముం
గొని శరధాటి వ్రాయుచు మ
ణుల్ గొనునట్టి కరాన కౌర! దై
వనియతి నెంత లెంతలు వి
పత్తులు వచ్చెఁ గటా! యికేమనన్. 22

ఉ. వేకువ జాము మేలుకొని
వేగమె కార్యము లాచరించి వా
కే కడ కేఁగు మన్న సరి
యే నని పోవుచు నద్దిజేసి పే
రాఁకట నిల్లుఁ జేర నొక
రైనను బల్కరు; ప్రేమఁజూప కా
రా! కఠినంపు దీక్ష యితఁ
డన్నియునున్ భరియించు వేత్తయై. 23

గీ. దేవునకు మించు దేవుండు, దేహమునకుఁ
గారణుం డగు తండ్రిని కట్టిడి నయి
మొఱకదక్క యొనర్చు నహీనకృతికి
యిదియు ఫల మింక దోసంబు నేది లేదు. 24

మ. అని చింతించెడు భారవిం గనియుఁ బ్రో
యాలాత్రిమైఁ జేరి పా
యని దుఃఖాశ్రుపరీతనేత్రముల నా
థా! యెన్నికష్టాలు వ
చ్చెను నీ బోఁటికి; చూడఁజాల నిసిరో
సిగ్గయ్యె నా యాత్మకున్
మన యైశ్వర్యముఁ బాసెనో; మఱియు నే
మార్పొందెనో? తెల్పుమా. 25

గీ. జ్ఞానహీనుల నధిక కష్టములు జెందు
గాన మీవంటి సుకవిశేఖరుల కెందు
నేని కష్టలవం బంటునే దలంప
నర్కబింబంబునకుఁ దమ మంటినట్లు. 26

గీ. కావునను దెల్పవలయు నీ కష్టదశను
నేను జూచి భరింప; దైవానుకూల
మింత దప్పిన నెటకేని నేఁగవలయుఁ
గాని యిటనుంట మిక్కిలి కాని పనియె. 27

క. అని వగచు కాంతతో "మ
జ్జనకుం డత్తింట నుంట చను నీ" కనుచున్
మును బల్కి యుంట కష్టా
ళిని జెందుచునుంటి నతివ! లెక్కడ కిందున్. 28

గీ. మనకుఁ బూర్వము గలవెవ్వి మాఱలేదు
మందుఁడగు మందుఁడిట్లు నా యంద ముడిపె
నొక్క యబ్దంబు నెట్లని యోర్చికొనుము
మనము నిందుండవలయు మా జనకు నాజ్ఞ. 29

గీ. వనిత! యీ యాజ్ఞ నాకు నొక్కనికె గాని
తక్కు వారి కొకింతేనిఁ దగుల బోవ
దోర్చినను నిందయుండు, మ ట్లోర్వలేక
యున్న మన పురికేఁగు సౌఖ్యోన్నతికయి. 30

క. అని సెలవిచ్చిన నాథుని
మనమున కొప్పిదముఁగూర్ప మగువయు నిం దే
నును నిలిచి వత్సరాంతము
మన పురికి న్వత్తునంచు మఱి యుండు నెడన్. 31

ఉ. చీటికి మాటికిం గసరి
చేసిన యూడిగ మొప్పకోక, నీ
వేటికి మా గృహాన వసి
యించుట ? తోఁచక నూఁతునెత్తిపై
మూటెడు నగ్నిఖండములఁ
బోసిన తప్పున మాకు మేము చీ
వాటులఁ బెట్టుకొంటి మిఁకఁ
బాఱుము వచ్చినతోవ నూరికిన్. 32

ఉ. అల్లుఁడు భాగ్యవంతుఁ డని
యందఱు ముందఱ నుబ్బుచుంటి మా
యిల్లును గుల్ల సేయుటకు
నియ్యెడఁ జేరెద వంచు నెంచలే
దల్లుఁడ! కూఁతు నిచ్చుతఱి;
నైనది యయ్యె నిఁకేమిసేయ మా
యిల్లును వీడి పొమ్మటకు
నేనియు నిన్ను భరింప నింతకున్. 33

ఉ. ఎందఱు తూలనాడిన మ
ఱెందఱు తన్ను హాసించుచుండినం
గుందడు; కోపమూపుకొను,
కూరిమి భార్య యపూర్వబంధపుం
బొందిక వెళ్ళి పొమ్మనక,
పోదమటన్నఁ దరింప రాని రీ
తిం దన తండ్రి శాపపుగ
తిం దలపోయు నొకింత ఖిన్నుఁడై. 34

క. ఇలుదాటి వెడలి పోవఁడు,
కల బందుగు లెల్ల నొకటిగాఁ గూడి తనున్
బలువిధముల దూషించిన
కలహింపక యూరకుండు కర్మవశుండై. 35

గీ. విసుగుఁ జెందక కుందక వెడలి పోక
యున్నయల్లుని తత్త్వంబు నూహఁజేసి
పొలము కావలి యుద్యోగమును ఘటించి
కసరి పంపించుచుండు నాగాలు లేక. 36

ఉ. ఆ తఱి నమ్మహాకవి మ
హత్తర సంస్కృత కావ్యసౌధమున్
బూఁత సువర్ణ వర్ణములఁ
బూన్చి సుశబ్దపు రత్నజాలపున్
జ్యోతుల బారుల న్నిలిపి
సొంపులు నింపుచు రాజకీయపు
న్నీతుల మెట్లతోఁ బృథివి
నెక్కన గట్టుచునుండె దక్షతన్. 37

ఉ. స్నానజపాది కృత్యములు
జారె, పొలాల కహర్నిశంబులున్
మానక పోవుచుండుట, స
మస్తవిధంబుల రక్తనాళముల్
బోనములేక చిక్కనవి
పూనికఁ దగ్గుచు నాఁడునాఁటికిన్
మానము పోవుచుండె నొక
మాసిన మూరెడు గుడ్డ చాటునన్. 38

గీ. నిదుర మంచానఁ గొంగును విదలుచుకొని
పొలము పోవును, జలమ్మును భోజనంబు
లనక కష్టించి పనిఁజేయు, వ్యవధియున్న
కావ్యమును వ్రాయు, నిలు సంజ కడను జేరు. 39

గీ. ఒక్కయెడ కావ్యకల్పన లూరుమ్మ లట్లు
దోఁచు నొకయెడఁ బనులు ముందునకు నెట్టు
మనసురాదయ్యెఁ గవికి చింతఁ గను మదికి
నొకటి విడనేర డింక వేరొకటి సేయు. 40

సీ. అన్నంపు లేమిచే నలసి శోషిల్లుచు
నుడుకుదుమ్ముల సెజ్జఁ బడి తపించు
తఱుఁగని పనిసేఁత తప్పించుకొని పోవు
నూహాప్రపంచాని కుచ్చులొడ్డు
తాఁ బొందు కష్టాలఁ దాలిమి వహియించు
భావిశుభస్థితిఁ బ్రస్తరించు
ప్రకృతి స్వభావాల పరివర్తనపు మాయ
లారసి లోలోన నలవటించు

గీ. శ్వశురగృహమందు వసియించువారు వల్ల
మాలిన మహానుభూతి సంపన్నులౌదు
రని తదీయ విజ్ఞాన కావ్యమును బ్రచుర
పఱచు నూతన హార్ద భావంబుతోడ. 41

ఉ. పాప మిటెంతలో సుకవి
వర్యు మహాదశ మారిపోయి యీ
పాపశతాలయం బయిన
ప్రాయిలు ముంగిట దిక్కులేక సం
తాపముఁ జెందగా వలసె;
తాఁ బుపు లమ్మిన పీటఁ గట్టియల్
మోపుల నమ్మె హీనదశ
మోసులు సూపినరీతి నక్కటా. 42

ఉ. అందఱి భోజనంబు లగు
నంతట మాపటివేళకుఙ్ బరి
స్కందునివోలె క్షేత్రమునఁ
జాకిరి జేసెడి భర్త యొద్దకుం
జిందిలిపాటు లే కరిగి
చేతెడు భిస్సటఁ గల్పు గంజి పో
యం దన నెమ్మనంబున న
యంబున సేయును దైవచింతలఙ్. 43

సీ. తెలుపారు కన్నీటి సెలయేటిలంకల
నాశ్రియవేదుల యందుఁ జేర్చి
సచ్ఛిలమణిమయ సౌధాల సిసలైన
బత్తిగద్దియల కేళ్రివలకుఁదార్చి
హృదయపాత్రి ప్రేమ సదమలకల్లోల
పాలికాడోలిక పైనిజేర్చి

దుఃఖంపుటటవీ పత్రితోళికలందు సాం
త్వనపు పరాగ వితర్దిఁ జేర్చి
గీ. భర్త కడుపులోఁ దలఁ దూర్చి బహువిధాల
కుమిలి యేడ్చి కష్టము దీర్చుకొనఁగ నుపమ
చిక్కక సతంబుఁ గుములుచు వెక్కస మగు
గడువు దినములకై భార్య గాంచుచుండె. 44

సీ. మలిన భూయిష్ఠమౌ వలువఁ గట్టును గాని
పట్టుపుట్టంబులఁ గట్టుకొనదు
చెదరు ముంగురులకు పదనిచ్చి మెఱపెచ్చఁ
దలదువ్వి సిగముడి మెలచుకొనదు
చెమట చారలు మేని గమక మూడ్చినఁగాని
తానంబు సేయను దలఁచుకొనదు
నగలు నాణెములు సెందమికి గుందదుగాని
పసుపు కుంకుమముల వాంఛ విడదు
గీ. మొగమునం బొట్టు సామాన్యముగ ధరించు
కడుపు కక్కుర్తికై గంజిఁ గుడిచి తిరుగు
దైవమును దూరు తన కష్టదశఁ దలంచి
యూపు రని యేడ్చు తీరని వ్యాకులమున. 45

మ. మొనగాడైన విపశ్చితుం డయిన యే
భూపోత్తముండైన నె
త్తిని కొమ్ముల్గన్న తనంత తా నరిగి య
ర్థిం దీనుఁడై యత్తయిం

టను జామాత వసింపఁ జుల్కన యగుం
దర్పించు నర్ధాంగి, యొ
వ్వనికిన్ రాదు సహింప నీ యనుమను
ర్వ్యాపార మాజన్మముల్.

క. ఆ రీతి దినము లెట్లో
పోరాడుచు దాటుచుండె బొద్దులువోక
ప్డారయ శ్రావణ భార్గవ
వారంబులు వచ్చె యువతి వర్గము నోముల్.

మ. కని చుట్టంబులు సేయు భీషణపు హుం
కారధ్వానుల్ రేగెనో;
యన గర్జించెను మేఘజాల మురవై
యర్ధాంగి దుఃఖాశ్రువో
యన నీలాంబుద మన్నిచోటులను వ
ర్షారంభముం జేసె, నం
దున లేయాస తటిల్లతల్ పొడమె న
న్యూనంబుగా నెల్లెడన్.

సీ. పూర్వపుణ్యము చేసిన పూవుఁబోండ్లు
నోచు కొందరు కోరిన నోములెల్ల
నట్టి వ్రతములఁ దానును నాచరింపఁ
గోరియుండెను లేమిచేఁ గుందుచుండి.

చ. వ్రతములు రేపనంగ గురు
వారపు రోజున మాడినన్నముం
బతి కొఱకై యథావిధిగ
భామిని దాఁ గొనిపోయి ఖిన్నయై
మతి మెలమెల్ల నేర్చుటకు
మాన్యుఁడు భర్త గ్రహించి యామెతోఁ
గతము వచింపఁగోరెఁ దమ
కంబునఁ జేరిచి బుజ్జగించుచుం. 50

గీ. కరుణ నోదార్చువారును, కారణంబు
లడుగువా రున్న సమయాన యంతులేని
దుఃఖములు మాటిమాటికి దొరలివచ్చు
సహజముగ స్త్రీల కెల్ల నాచార మిద్ది. 51

గీ. ఎల్లి నోములకై యున్న లెన్ని యెన్నొ
వలయు నగల నొసఁగిరి భార్యలకు, మాట
కైన నోములు నోచుకొమ్మనఁగ లేద
టన్న కతమునఁ జింతించి తెంచుఁ జెప్పె. 52

గీ. గడువుదినములు దాదాపుగా ముగియఁగ
వచ్చినవి, యంతదాక నా యిచ్చమెలఁగు
వలయు నగలను నీవు దాల్పఁగల నంచుఁ
దాను వ్రాయుచు నున్న గ్రంథంబునుండి. 53

శ్లో. సహసా విదధీత నక్రియా
మవివేకః పర మాపదామ్ పదమ్
వృణుతేహి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయ మేవ సంపదః. 54

ఉ. ఏ పని సాహసించి యొన
రింపఁగరా దవివేక మెంతయో
యాపదఁగోరు, సంపదలు
యాచనసేయును సద్గుణంబులన్,
కాపటికంబు హీనతకుఁ
గారణమౌ, పరికించి చక్కఁగా
లోపము దిద్దువారలకు
లోనగు సంపద లెల్లభంగులన్. 55

మ. అని తాటాకున శ్లోక మొండు తన కా
ర్యాసక్తిచే వ్రాసి, దీ
నిని బేహారి గలండు పండితుఁడు వా
నిం జేరి నేఁ జెప్పినా
నని తాకట్టుగఁ బెట్టి సొమ్ముఁగొని వాం
ఛార్థంబు లీడేర్చు కొ
మ్మని వాకిచ్చె, ప్రియాంగనామణికి నా
హ్లాదంబు సంధిల్లఁగన్. 56

గీ. అతని నామంబు మురహరుఁ డనఁగ నొప్పి
కోటికి బడఁగనెత్తినమేటి, యెంత
ధనము గలదో మఱంతటి దానశాలి
సద్గుణంబుల కిక్క, సంశయ మదేల? 57

గీ. పడఁతి ! శ్లోకంబు తాకట్టు వదలిపెట్టు
కొనక కావ్యంబుఁ బ్రకటింప మని ఖరారు
పడుము, జ్ఞానసముద్రుఁడు వాఁడుగాక
పరులు నా ప్రజ్ఞ నరసెడి వారు గలరె? 58

క. పతిమాటకు జవదాటక
సతి శ్లోకంబును గ్రహించి సంతోష తరం
గితమతి యై వర్తకు నా
యతనంబున కేఁగె వ్రతమునందలి కాంక్షన్. 59

శా. శ్లోకం బిచ్చి వణిక్ఛిఖామణికి నా
శ్లోకార్థ ముత్సాహియై
వాక్రుచ్చెన్; వణిజుండు గైకొని సతిం
బ్రశ్నించి సొమ్మిచ్చి యా
శ్లోకంబుం దనగొట్టమం దునిచి ముం
జూరందునం బెట్టి, తా
టాకుం బుస్తక మందు జ్ఞప్తికయి వ్రా
యంజేసె నా పద్ధతిన్. 60

గీ. వణిజుఁ డిచ్చిన నిష్కాలఁ గొని వ్రతంబు
వదినెయక్కల కంపెను వైభవముగ
జరుపుకొనియెను హర్షాన వరుని జ్ఞాన
మహిమ సామ్రాజ్య భోగసంపదఁ దలంచి. 61

ఉ. శాపము దీరి పోయె నిట
సత్కవిరోజులు మంచి వయ్యె, సం
తాపపు టగ్నియారె నని
దారకుఁ దెల్పి తదీయ బంధులం
బాపల హెచ్చరించి తన
పద్మపురంబుఁ గనుంగొనంగ ను
ద్దీపితచిత్తుఁడై చనె స
తీయుతుఁడై ప్రతిభాసమేతుఁడై. 62

# తృతీయాశ్వాసము



క. శ్లోకంబును తనయింటను
తాకట్టుగఁ బెట్టుకొన్న తదుపరి వణిజుం
డాకాంక్షఁ జేసె ధనముం
జేకొన ద్వీపాంతరములు శీఘ్రము లంచున్. 1

సీ. మొలకవజ్రాలను ముల్లెలుగట్టి భ
ద్రింబుఁ గావింప ముద్రిలను వేసి
కులుకు ముత్తెంబుల కొట్టడిఁ దీయించి
బాలుసారు పెద్ద గోనెలకుఁ బోసి
పెద్దలు దాఁచిన పేరెన్నికను గన్న
రత్నముల్ మందసరాజిఁ జేర్చి
మురిపంపు టపరంజి ముద్దల భోషాణ
ములయం దునిచి బీగముల బిగించి
గీ. కడలి చిన్నారి కొమిరెకుఁ గాన్క లొసఁగి
పూజనముఁ జేసి భార్యతో ముచ్చటించి
చోద్యమును గూర్చు కడువింత సొమ్ము లన్ని
ధరణి కెత్తించి బేహారి తరలిపోయె. 2

చ. కులికి సముద్రియానమునఁ
గూరుకు బట్టెడి యర్ధరాత్రి పె
ల్లలలు వెలార్చి సాగరము
నందు తుపానులు చిమ్మ రేఁగి కు

ప్పలుగ నురుంగు లుబ్బుకొని
పైకొని పొంగుచు రేఁగి భూధరం
బులవలె మిన్ను ముట్టఁ బెను
మ్రోఁతలఁ బెట్టుచు లోకభీతిగన్. 3

మ. బలిమి న్వీఁచు తుపాను త్రోపిడులకుం
బాధోధి కంపించి, యు
గ్గలపుం దుంగ తరంగ సంఘరవ మా
కాశంబుతో రాయఁ, బె
న్గలిమి న్వర్తకుఁ డేగు నా తరణి కం
గార్తై మునింగెన్ మహో
జ్జ్వల రత్నాళి ధనంపు మందసములే
పాడయ్యె నొక్కుమ్మడిన్. 4

క. కొందరు సాగర గర్భము
నందునఁ గూలిరి తరించు నాశన్ బలిమిం
గొందఱు నేర్పున నీదిరి
మ్రిందిరి వందలకొలంది మనుజులు చింతన్. 5

మ. జలధిం గూలిన సర్వ పాంథజన యో
షా కంఠ సంలగ్న మం
గళ సూత్రంబుల కాంతి లోకమునకుం
గప్పెన్ విషాదంపు దు

వస్త్రాల ధనరాసులుం గలిఁగి
కాంచన మార్జన సేయు దీక్షతోఁ
గులికి విదేశయాత్రలను
గోరితి నే నడియాస పెంపునన్. 9

గీ. కడలి నడుమఁ దుపానులు కావరించి
నగలు రత్నాలతోపాటు నావ మునిఁగి
నను దరిద్రునిఁ జేసెఁ జండప్రచండ
కాల పురుషుండు చెలరేఁగి గడియలోనె. 10

చ. అడిగినవారి కిచ్చుటయె
యాచరణాధికబుద్ధిగాని నే
నడుగఁగఁబోను, లేదనను
నర్థమదంబున విఱ్ఱవీఁగుచున్
బుడమి సమస్త వస్తువులు
బుద్బుదతుల్యము లంచు నెంతు నె
ప్పుడును, విరోధ కార్యముల
పొంతకు బుద్ధి మఱల్పకుండఁగన్. 11

ఉ. స్వీయచరిత్ర మెప్పుడును
జెప్పుకొనంగను పాడిగాదు, నా
కీ యెడ లేరు నేస్తులు మ
ఱెవ్వరు, హస్తముఁ గ్రిందుజూపుటన్

రోయు మనస్సు, నెట్లయిన
నం దరిమాలిన రోజులందు నేఁ
జేయున దేమి లేక యిటు
జిక్కితి మిక్కిలి చింతఁ గుందుచున్. 12

మ. అనినన్ బాంధుఁడు సావకాశముగఁ ద
ద్వాక్యపారి దిక్కొంచుఁ బ్రా
ర్థన సాంతంబుగఁ జిత్తగించి తనలోఁ
దానేమొ చింతించి నె
త్తని చిత్తంబు వెలార్చి సాంత్వనపు టు
ద్యద్వాక్కులన్ బుజ్జగిం
చి నయంబున్ బ్రవచించె నూత్న పథమున్
జింతన్ వెసన్ బాపఁగన్. 13

చ. ఇది యొకలంక, సింహళుఁ డను
నేలిక మున్ గనిపెట్టి రాజ్యము
న్విదితయశుండునై నిలిపి
విశ్వము తన్ను నుతింపుచుండఁగా
'కుదురుప' దేశ నామ మిడి
కోరి వసించెడి పట్టణాని క
ష్డదటున బెట్టె సింహపుర
మంచును సార్థకనామమై తగన్. 14

గీ. పుట్టి గోచులు బెట్టిన పూటనుండి
పౌరుషపు నెత్తురుల వార్ధిఁ బరుగులిడుచు

సాము గరిడీలు నేర్తురు సమరదీక్షఁ
బిడుగు తునకలె యవ్వీటి పిల్లవాండ్రు. 15

మ. ధనధాన్యంబుల కాటపట్టు డమరో
దగ్రింపు టుద్యోగ్నముల్
గన నీ దేశమునందు నున్న ధనకాం
క్షం గ్రూర కార్యాలపై
మనసుం బెట్టఁగఁబోరు, యాచకుల స
న్మానించు నాచారమే
మునుజన్మంపు తపంబు భావము సత
మ్మున్ రాజు లవ్వీటిలో. 16

చ. బలిసి మదాంధులై గవిసి
పౌరుషము న్నిగిడించు పాడు రా
జుల కదనాన పాడయిన
శూరుల కాంతల మేల్మి నల్ల పూ
సల విషగాథ మే మెపుడు
సత్యముగా వినలేదు చుట్టు వా
ర్ధులు గల దీవియాటను న
రుల్ సొర నేరని కారణంబునన్. 17

ఉ. ఇంచుక దాపునందు గల
దీశ్వరు కోవెల సజ్జనాళి పూ
జించుచు మంచి కానికలఁ
జేర్చి నుతించెద రట్టి వెవ్వి తే

చ. పరిమళయుక్తమై తనరు
బాలసమీరము లబ్బురాన భూ
ధరమునఁ బుట్టి జీవుల ను
దారగతిం దనివందఁజేసి, ని
ర్భర సుకుమార గాథ కవి
రాజులకుఁ దలియించు మర్మ మం
దరసితివా! విచారదశ
యంతము నొందు నిమేష మాత్రిలో. 21

మ. సొలపుంగల్గును రాత్రిలందు గిరిపై
జ్యోతిర్లతా గుచ్ఛపు
న్వెలుగుంజూడ స్వదేశ యాత్రికులకుఁ
విభ్రాంతచేతస్కులై
యలపుంజెంది కృశించుచుం గొఱవిద
య్యా లట్లు భావింతు ర
న్యులు, తత్కాంతి విమర్శనీయము హితా
యోజింపు భీతిల్లకఁ. 22

ఉ. అచ్చపు సొంపుపెంపున ది
నాంతము శాద్వలసీమలందు వేఁ
బచ్చిక మేసి మేసి, చెలు
వంబున జింకలు స్వేచ్ఛ యొప్పగా

నచ్చిక బుచ్చికం దిరుగు;
నత్తఱి ముద్దుగఁ జెల్మిఁజేయఁగా
నిచ్ఛజనించు, జిక్క వవి
యెంతప్రియత్నముఁ జేసినన్ సఖా. 23

ఉ. పోవఁగఁబోవఁ దోఁవ నొక
పూఁచిన దివ్య వనాన మాఁకులుం
గోవెల లాది పక్షిగణ
కూజితముల్ జెలరేఁగుచుండు, నం
దేవి శకుంతరాజియొ? మ
హేవి లతాంతపు వింత సొంపులో
నీ వెలుఁగంగలేవు మహ
నీయ! ప్రహర్షము చెంగలింపఁగన్. 24

ఉ. ఆమడదూర ముండి రనఁ
గా వనదేవత ముమ్మరించి యెం
తో మురిపాన పాంథులను
దోడ్కొని స్వాగత మీయనో యనన్
గోమలవాయు డింభకుల
గుంపులు గుంపులఁ బంపుచుండు, గా
రామున వింతపూవుల ప
రాగము కానికబెట్టు సొంపునన్. 25

ఉ. ఆ వన రామణీయకము
నారసినంతనె భాగ్యదేవికిం

దావలమైన దేశమని
తప్పక దోఁచు సుమీ, విదేశ పాం
థావళి కద్దియే ప్రథమ
దర్శనచిహ్నము సంతసింప, నీ
కా విభవంపు దర్శనము
నందుట జన్మ తరించుటే సఖా! 26

చ. పొలముల కాపుబాలికలు
బొమ్మల గీముల నేర్పతించి, సొ
మ్ముల గదియించి సేసలను
బోయుచుఁ బెండిలిఁ జేయుచుంద్రు బె
ద్దలగతి; యద్ది నీ వరసి
తాళి; యిదేమని ముచ్చటింపఁ, బ్ర
క్కల నడయాడుచుందురు ప
కాపక నవ్వుచు లజ్జపెంపునన్. 27

మ. రమణీయంపు విచిత్ర వస్తుతతిఁ జే
ర న్వాంఛ గావించు నం
దు మనంబందున భ్రాంతిపుట్టి, దుద నా
త్రోవ న్విలోకింతు వు
త్తమవాఃపూర విశాలదీర్ఘిక తరూ
ద్యచ్ఛాయలన్ నిల్చి సౌ
ఖ్యము నా మీఁదట గాంతు సింహపురి వ
ప్రాంతంబు నగ్రద్యుతిన్. 28

మ. తళుకించు న్నగరంబు నంతటను వి
ద్యుద్దీపముల్ వాడవా
డలఁ జెన్నారును రంగవేదికలు, వే
డ్కన్ మేళతాళాల స్వరం[illegible]
పులు శ్రోత్రంబుల కింపుగాఁ బొడము బొం
బూ! చంద్రకాంతోపలం
బుల సౌధాల విచిత్రదర్శనము నిం
పుంగూర్చు కన్దోయికిన్. 29

గీ. పంచమస్వరంబున వేశ్యభామలెల్ల
తీగరాగాలఁ దీయుచుఁ దిరుగుచుంద్రు
వలపు కిన్నెరసానులు వచ్చి వియ్య
మందెదరు తన్మహానంద మనుభవింప. 30

ఉ. సొమ్ముల నెమ్మెకత్తియలు
సొంపుగఁ బెట్టి బజారులందు నం
దమ్ముగ రాత్రులందున స
తమ్ము చరింతురు, చూచినంత క
న్దమ్ములు గోరగించి పయి
నంబడ చిత్తము భ్రాంతిఁగొల్పు, దే
శమ్ము పరిస్థితుల్ మది వి
చారణసేయుము నిబ్బరించుచున్. 31

చ. కులుకు మిటారి కత్తియలు
గొందఱు నిన్వలపింపఁజేయ సొ

మ్ములను ధరించి మన్మథుని
పూవుల వింటిని యెక్కు-పెట్టి చూ
పులశరజాల మేమఱక
పూనిక వేయుచు లేనిపోని భ్రాం
తుల గలిగింతురయ్యా యవి
దుఃఖము దెచ్చు నొకప్పుఁ డుద్ధతిన్. 32

గీ. సింహనగర ముఖద్వార సీమయందు
సత్రశాల గలదు, నీవు జనెదు సరికేఁ
బొద్దుగ్రుంకును, నచ్చోట బోన మారఁ
గించి నిదురింపు మా యింటి పంచలందు. 33

గీ. పగటివేళను జొచ్చి యీ పట్టణంబుఁ
జూడవచ్చు నేఁ జెప్పిన చోద్యములను
తనివిఁ దీరంగ; రాజభవన విచిత్ర
ముల పసందు వర్ణింపగా నలవిగాదు. 34

గీ. అన్నపానాల కే మాత్ర మడ్డులేదు
నీవు యాచింపఁ బనిలేదు నిజము మిత్ర!
కోరుకొననిదే హెచ్చుగాఁ గూర్చువార
లెవ్వరైనను సందు లొకెందులేదు. 35

గీ. అడిగి కైకొంట నీచకార్యం బటంచు
దలఁచితివయేని కష్టించి ధనముఁగొను మ

తే. మగసిరి యన్నిటికన్న, నెప్పుడైన
నరుగగా వచ్చు నీ దేశ మడ్డులేక. 36

గీ. ముక్కు దోమల యోధులు ముమ్మరించి
నిదుర దేవి రాజ్యంబుపై నివ్వటిల్లి
సిలుగు గూర్తురు ముక్కు బాకుల నిగిడ్చి
గాలిపగతుని కంటికిఁ గానరాక. 37

గీ. మఱచితి క్షమించు మప్పాజి మర్మమొండు
వేఱుభాషను మాటాడు విధము గలదు
నీకు రాదది; కొన్నాళ్లు నేర్చికొమ్ము
కష్టముల దేవి యొకనినే కౌఁగిలించు. 38

గీ. మంచి సెబ్బర లన్ని క్రమంబుగాఁగ
వర్తక శిఖామణికిఁ దెల్పి బాటసారి
పోయివచ్చెద ననిచెప్పి పోయె నెటకొ?
యతఁడు మనుజుఁడో? దైవంబొ? యరయరాదు. 39

ఉ. తూరుపు తెల్లనయ్యె, దరి
దోఁచక దేవునిఁ బూజసేసి క
న్నీరుల మున్గి తేలి పయి
నింపఁ గడంగెను సెట్టి యొంటిగా
దారుల కేకరింపక ని
దానముతోడను, బొంగివచ్చు నీ
హారము దప్పుకొంచు పథి
కాగ్రిణి చెప్పిన గుర్తుచొప్పునన్. 40

మ. కల చోద్యంబులఁ గాంచె మారయుచు మా
ర్గంబు న్విలోకించు చా
వల దుఃఖం బొక యింతవీడి, హరిపై
భారంబునుం బెట్టి లో
యల సత్త్వంబుల ఘీంకృతు ల్వినుచు ధై
ర్యంబంది యేకాకియై
యలఁతన్ సింహపురంబుఁ జేరఁ జనె సా
యంసంధ్యా కాలంబునన్. 41

ఉ. అంతట వర్తకుండు పుర
మంతయుఁ ద్రిమ్మరి బాటసారి బ
ల్వింతగఁ జెప్ప చిత్రముల
వేడుకగాఁ గనుగొంగ నా పురం
బంతయుఁ జూచి, యెక్కుడగు
హర్ష సుధాంబుధి నోలలాడి సా
యంతనమందు నొక్క నిల
యంబును జేరెను విశ్రమింపఁగన్. 42

సీ. నాఁటిరాతిరి యా యింటి నాయకుండు
మురహరు చరిత్రము న్విని కరుణ వొడమ
నతిథి సత్కారముల నెల్ల నాచరించి
వింతగను విందుఁగూర్చె సుస్వాంతుఁ డగుచు. 43

ఉ. పిలిచినఁ బల్కనొల్లడు త
పించును గోత్ర మునీంద్రుపోలె తాఁ

చిలిపితనంబున బలుకు రెవ్వరును
వేరొక బాసను నుచ్చరించుటన్
గలఁతను జెంది భీతిఁగొని
కష్టదశం దలపోయుచున్ వెసన్
గలయ పురంబు నంతట వి
కారముతోఁ దిరుగాడు జోగినై. 44

మ. మఱియింకెట్టుల నా స్వదేశమును జే
రం జూడ వీలౌనో ? నా
మురిపెంపుం గులకాంత సుందరముఖాం
భోజాత మేనాఁడు నేఁ
బరికింతున్ మునువైభవాల బదు లా
పాదించెఁ గష్టాలు, నా
చరితంబు న్వినువార లెవ్వ రకటా !
సంతాప చిత్తంబులన్. 45

గీ. ఇచట వారల బాస నే నెన్నఁడైన
వినియు నేర్చి యెఱుంగ; నెవ్వనికి నిచట
నా పలుకు దెలియ దకట! యీ పురంబు
నందు నన్ద్రోయు విధిని నే మందు నింక. 46

గీ. మంటి చారలచే మేను మాసిపోయె
చినిఁగిపోయెను వస్త్రాలు; చేయి చాచి
యొరుల యాచింప నేర నోగిరము లేక
మురహారుఁడు పరుండె విచార పరవశుఁడయి. 47

మ. అతఁడట్లావల చింతచే విసిగి కా
ర్యంబేదియుం దోఁచకన్
వెతలం జెందుచుఁ గొంత కాల మెటులో
వేసారి, తద్దేశపున్
గతులన్ వర్తకమర్మముం బరిబలకాం
క్షన్ గొన్ని తంత్రింబుల
ద్భుతరీతిన్ గ్రహియించి కూర్చి దరివిణం
బున్ ధీరుఁడై యన్నిటన్. 48

మ. చిరకాలంబునకైన రాని కతముం
జింతించి చుట్టంబు లం
దఱు బేహారికి నుత్తర క్రియల స
ద్ధర్మాన చేయించి పో
యిరి; నిస్సీమవిచారవారినిధి నా
యిల్లాలునుం బుత్రిఁడున్
దరియుం దోవయుఁ దోఁచకుండి రట నిం
టం గష్టముల్ జెందుచున్. 49

గీ. వరదఁ బోయిన సెట్టి లాభమున వచ్చు
విధము; పందొమ్మిదేండ్లకు వింతఁదోఁప
వర్తకుండు స్వగ్రామంబు వలపుతోడఁ
జేరె, ధనరాశితోఁ దనవారిఁజూడ. 50



# చతుర్థాశ్వాసము



ఉ. తీరని దుఃఖపుంగడలిఁ
దేలుచు నాఁటిదినాన నెందుకో
చూరున దేవులాడ నల
శ్లోకపు గొట్టము గానుపింపఁగా
భారవి మున్నొకంట గుదు
వంగను బెట్టినదై సెలంగు నం
చారసి పత్రికన్ఁజేర్చి పతి
నాత్మఁ దలంచి పరుండె పుత్త్రితో. 1

గీ. ధనపు శకటంబులను పంచదరిని నిల్పి
మదన తాపానలంబున మ్రగ్గుచున్న
అంగనను జూడ సంతోష మతిశయిల్లి
అరిగె మురహారుఁ డింటికి బిరబిరాన. 2

గీ. గాఢనిద్రను జెందెడి కాంతతోడఁ
బవ్వళించిన పూరుషుఁ బొలుచూచి
యెవ్వఁడో యని మదిలోన నెంచి, యౌర!
సతుల చిత్తంబు లెంతయు చంచలములు.

గీ. అని తలంచుచు నుండెడి యంతలోన
సతి చివాలున లేచి మంచంబు డిగ్గి
నాఁడు పరదేశ మేఁగిన నాథుఁ డనుచు
గురుతుపట్టి మొగాదిగ పరికరించి. 4

ఉ. తీరని సంతసంబునను
దివ్వె వెలుంగు వెలుంగఁ జేసి, యిం
పారఁగఁ జూచియు న్మగని
యబ్బురపాటున గౌఁగిలించి కం
గారు మనంబుతో నతని
కట్టెదుటన్ నిలుచుండి యుబ్బి తా
భోరున నేడ్వ సాగె తన
పూర్వపు కష్టము లోడిగిల్లగన్. 5

గీ. నిదురమంపున మంచానఁ గదలుచున్న
తనయునిన్ లేపి నేఁటికి జనకుఁ డెట్లొ
వచ్చె! లెమ్మురా! యని లేపఁ, బండ్లుఁ గొఱికి
దిగ్గునను లేచెఁ గోపాగ్ని భగ్గు మనఁగ. 6

గీ. నాథుఁ డెక్కడికో పోయినాడటంచు
కలుషమతి వయి పుత్త్రునిఁ గాంచి, నాదు
పుత్త్రుఁడని చెప్పుచుంటి వపాత్రురాల
ధాత్రి మోహాంధకారిణుల్ తరుణు లరయ ? 7

గీ. "నగల నమ్ముటకై పోవునాఁటి కేను
గర్భవతినిగదా ! చిరకాల మగుట
మఱచితిరి యే మొకో!" యన, మగఁడు "నన్ను
వంచనముఁ జేయఁ గపటోక్తిఁ బలుకుచుంటి." 8

మ. అని రోషాగ్నిఁ వెలార్చి నిష్ఠురపు వా
క్యంబుల్ బ్రసారించి కా
లుని చందంబునఁ జెంతనున్న యొక వా
లుం గేలఁ గైసేసి భా
ర్యను జంపంగఁ బ్రయత్నము న్సలిపి ప
ర్యంతస్థ మా లేఖనుం
గని యెవ్వాఁడో లిఖించె నంచు కడుకం
గా రై విలోకింపఁగన్. 9

శ్లో. సహసా విదధీత న క్రియా
మవివేకః పర మాపదాం పదమ్
వృణుతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః. 10

ఉ. ఏ పని సాహసించి యొన
రింపఁగ రా దవివేక మెంత యో
యాపదఁ గోరు, సంపదలు
యాచనచేయును సద్గుణంబులన్
గాపటికంబు హీనతకుఁ
గారణమౌ, పరికించి చక్కఁగా
లోపము దిద్దువారలకు
లోనగు సంపద లెల్ల భంగులన్. 11

చ. అని పఠియించి కోపమును
నాపి చివాలునఁ గత్తి నేలపై

నునుచుచుఁ గన్నొమల్ ముడిచి
యొప్పరికింపఁగ మిత్రుఁడో కవీం
ద్రుని రచనంబటంచు చెలఁగి,
తుందుడుకు న్విడనాడి భార్యనుం
దనయునిఁ జేరఁదీసికొని
తాను ముదంబుధి నోలలాడుచున్. 12

ఉ. భారవి శ్లోకపు న్మహిమ
వల్లఁగదా! తలఁపన్ మదీయ సం
సారము దక్కె శాంతిఁగొనఁ
జాలి చరించుట; యద్ది లేని-చో
భూరివిచారవారినిధి
మున్గి నశించెడివాడనే, భళీ!
కారణజన్ములౌ బుధుల
గణ్యతరోక్తు లభీష్టదంబులౌ. 13

సీ॥ కుదువఁబెట్టిన శ్లోకంబు కొఱవగుటను
గావ్యమును బ్రకటింపక కవివరుండు
వర్తకునిరాకకై వేచి వర్తమాన
ములను గొనుచుండె రాయబారులను బంపి. 14

ఉ. ఎందరొ వచ్చి భారవి క
వీంద్రునితోడ మహానుభావ; నీ
వెందుల కింక గ్రంథమును
నేరికిఁజూపవు, వర్తకుండు ని

బ్బందిని బెట్టునప్పటికిఁ
బైకము జిక్కదెనాఁగ! తొంటి యొ
ప్పందముఁజేసి తా వినఁడు
వారల బోధల నెన్నియేనియుఁ. 15

గీ. అంత బేహారి నిజపురి కరుగుదెంచు
వార్త విని శ్లోకమున కయి పైకముఁగొని
సంతసము పొంగిపొర్లంగ సత్కవి యొక
మంచిరోజుఁ బయనముఁ గావించుచుండె. 16

ఉ. భారవి సత్కవీంద్రు ఋణ
బంధనముం దెగత్రెంపి వానినిం
జారుతరంపు కానుకలను
చక్కఁగఁ గొల్వకయున్న నెల్లరుఁ
దూరక పోవరంచును వ
ధూమణితోడను మూఁడువేల బం
గారపు నాణెముల్ గొనుచు
గ్రక్కున వర్తకుఁడుం బ్రయాణమై. 17

ఉ. దారిని బోవుచుండు నెడ
తజ్ఞుఁడు భారవి సత్కవీంద్రుఁ డా
దారినఁ గానుపింపఁగ ము
దంబున వర్తకుఁ డా కవీంద్రునిం

జేరి నమస్కరించి "కవి
శేఖరు శ్లోకముచే కుటుంబ మీ
తీరున నుంటయుం దెలిపి
దీవన లి"మ్మని కోరె భక్తితో. 18

మ. అనఘా! మా కడ ద్రవ్యముంట, భవదీ
యంబైన వాక్ఛక్తి నా
కును నా బోటికి నిల్బెఱుంగుట కగుం
గూర్మి న్ననుం గాంచి మీ
రనువౌ ప్పారంగ తొల్లి గైకొను ఋణా
ర్థం బుంచు పత్రింబు మీ
ఘనతం దెల్పెడి శ్లోక మే నిడెదు కా
న్కల్ గొండు ప్రార్థించెదన్. 19

గీ. అనుచు ఋణపత్ర మిచ్చి కావ్యాంతరంబు
నందునం జేరు శ్లోకంబు వందనముల
మెచ్చి పసిండి నిష్కంబుల నిచ్చి దేవుం
బూజనేసిన గతిం గవిం బూజసేయ. 20

ఉ. అతండు ప్రేమవీధిని వి
హార మొనర్చుచు నుత్తమర్ణు లీ
రీతిగ నుండువారొకో ? వ
రించెను నీదగు సద్గుణాళి నా
చేతముం గాన గైకొనుము
శీత మయూఖ దినేశు లుండు దా

కాతమ్మైన కీర్తిని 21
యన్వయ మిద్ధర బొంగి తేరఁగన్.

గీ. అంచు నాశీస్సు లిడిన కవ్యగ్రియాయిఁ
బల్లకిని నెక్కఁజేసి తా నల్లమలర
స్వీయపురికిని గొనిపోయి శ్రోత్రబంధు 22
హితులు మెచ్చంగ నాత డద్భుతపుభక్తి.

మ. పురి నూరేగఁగఁ జేసి, కానుకలిడి, ధీ
పూర్ణున్ గవీంద్రున్ బొరిం
బొరి తృప్తిం బొనరించి, వానివలనన్
బోధ్యంబుతో వాని నే
ర్పరియై వించు జగజ్జనంబు పొగడన్
వర్ధిల్లె నే ప్రొద్దులున్
బురుఁ డవ్వారలు వీని క న్నుడి నభో
భూభాగముల్ నిండఁగన్. 23

ఉ. బంధుర మల్లికా ప్రసప
పంక్తిగళన్మకరంద బిందు పు
ష్పంధయ చక్రవర్తిగతి
భాసిలు సత్పద గుంభనంబులన్
గ్రంథము నల్లినా డతని
గాంచి తరించెద నంచు భోజుఁ డా
నందముతోడ భారవిఁ గ
నం జనుదెంచెను పండితాళితోన్. 24

గీ. నీవు వ్రాసిన గ్రంథంబు నేర్పుఁజూపి
నన్ను కృతిపతిఁగాఁ జేసి నాదుయశము
నిఖిల దిగ్దేశ రాజన్య నికరములకుఁ
దెలియఁజేయుచు నాశీర్వదింపు మనఘ! 25

మ. అనినన్ భారవి సంతసించి కృతి ని
య్యందగ్గ భూపాలుఁ డీ
యనఘుం డంచు దలంచి యియ్యకొనె, య
య్యార్యోత్తముల్ బాంధవుల్
దన పాండిత్యముఁ జూచి సంతసిల ని
త్యశ్రీలు వర్ధిల్లగాఁ
జనియెన్ భోజుని వెంట సద్భటులు ని
చ్చన్ దన్ను సేవింపఁగన్. 26

గీ. కవులు గాయకు లాదియౌ ఘనులు గొలువ
భోజ భూపాలుఁ డాస్థాన భూమియందు
రమ్య మణిరత్న మౌక్తిక రాంకవములు
బహుమతి నొసంగె భారవి పండితునకు. 27

సర్గము సంపూర్ణము.



వంచును సంశయంబు వల
దయ్య భజింపను గొండమల్లె లిం
చించుక గాంచఁగాఁ గలవ
యెక్కడఁ జూచిన నక్కడేసుమీ. 18

ఉ. ఆ కనుపించు పర్వతపు
టద్దఱి హ్రాదిని యొందుబాఱు న
స్తోక తరంగ డోలికలఁ
దూఁగుచు హంస వధూవరుల్ సదా
కోకనదంపు వాసనల
కున్ భ్రమియించు తదీయభాగ్యమున్
దాఁకొని చూడుమా కడు ము
దంబిడు నాత్మకు మిత్రబుద్ధితో. 19

ఉ. ఆ నది దేశమంతటను
నార్చుచు బాఱును, భూమియందుఁ గ
ళ్యాణమయంబు, శోభనపు
టారతు లిచ్చి దిగీశ బృంద మెం
తో నుతియించు చుందురు, బ్రి
తన్నము లెట్టివో గానరాక త్రే
మాన ధరాతలేంద్రుఁ డస
మానుఁ డటందురు నిత్యమ్ముం బ్రజల్. 20

ముష్టల నేపథ్యము; మృత్యుదేవి ప్రతిభగ
బొంగార విప్వార్చి భీ
తిలఁ గూర్రంబగు చూడ్కులం బఱచి యు
త్సేకించె నొక్కమ్మడిగ. 6

గీ. ప్రాణి సంరక్షణార్థమై ప్రక్కనున్న
పడవను గుబేలునం దూఁకి వర్తకుండు
మైమఱచి సొమ్మసిలి యన్య మండలంబుఁ
జేరెఁ బ్రాణాలఁ జేకొని చింతతోడ. 7

చ. వసువులఁ గొల్లఁ బెట్టుకొని
వర్తకుఁ డేడ్చుచు నొక్క దిక్కు నం
దసువులఁ జేతబట్టుకొని
యార్తిని చెందుచు గబ్బు చీఁకటిగ
విసుగుచు నుండ దైవవిధి
వింతగ నొంటరిగా గమించు మా
నిసిని హఠాత్తుగా నరసి
నెవ్వగఁ బిల్చెను గద్గదంబునగ. 8

చ. పిలిచి నమస్కరించి తన
పేరును నూరును విన్నవించి, వ్యా
కులపడు చిత్తమాపుకొని
కోటుల లెక్కకు దీరినట్టి పు

క. కొమరుని విజయం బారసి
సుమనస్కుఁడు తండ్రి వాని స్తోత్రంబునకుం
దమకక నుతింపకుండెను
క్రమమే గద పుత్త్రు మేలుఁ గాంక్షించు టిలన్. 33

చ. పొగడకయున్న మానె, కడు
పూన్కిఁ బొగడ్తలఁ దెల్పువారితో
"మిగులఁగఁబల్కఁ బోవకుఁ డ
మేయగుణాత్ములు మీరు బాలుఁడే
యగుగద, మీదు దీవనల
నందఁగ నోపినవాఁడు పాండితిన్
దగడు నుతింప" నన్న వచ
నంబులఁ బల్కఁగఁ జొచ్చె నయ్యెడన్. 34

ఉ. ఆ వచనంబుచేఁ గుమిలి
యా సభనుండియు లేచి పోయి దు
ర్భావముతోడఁ డిల్లికిఁ గ
రం బహితం బని యెంచఁబోక, ప్ర
జ్ఞావహమైన చిత్తము వి
చారముఁ దోఁపఁగ విన్నవించె గో్రి
భావిల మానసుం డగుచు
తండ్రి విధిం బిసుమంత దాపకన్. 35

మృదుమధుర శబ్దములతోడఁ గదలి వచ్చు
పరుల కేరికి రాని భావములతోడ. 20

చ. జనకుఁడు గూడఁ బండితుఁడె
శాస్త్రపు వాదములందు మంచి పే
ర్గొనిన విశారదుండె, సరి
కోవిదులెల్ల నుతింపనిల్చెఁ, ద
త్తనయుఁడు నట్లె ? పండిత ప
దంబున కేమి కొఱంత ? రత్నపుం
గనులను జాతిముక్క గనఁ
గా నగునే ? ధరణీతలంబునన్. 21

గీ. కొడుకు కీర్తిఁ గూర్చి గొప్ప కవులు
తండ్రిమ్రోలను పల్మాఱు తఱచి తఱచి
బహుగతి నుతింపఁ గోపించి బాలకుండు
పొగడఁ దగఁ డను గాని, యుప్పొంగఁ డెప్పుఁడు. 22

గీ. పుత్త్రగుణములు తండ్రులు పొగడఁ జెల్ల
దంచు లోలోన హర్షింతు రమలమతులు
పొగడినను నాయురభివృద్ధి పొసఁగకుంట
నజ్ఞులెఱుఁగక పొగడిక లాడుచుంద్రు ? 23

ఉ. ఏ సభఁగాని పండితక
వీంద్రులు తన్గణుతించు పట్ల సం
తోసముఁ జెందఁబోవక యొ;
దుష్టునిరీతి, విరోధిభాతిఁ, జే

# విజ్ఞప్తి

పాఠక మహాశయులకు!

సుప్రసిద్ధుండగు భారవి మహాకవి జీవిత చారిత్రంబును నేను 1931 సంవత్సరమే రచియించితిని. కాని నానాఁటికి దేశ కాల పరిస్థితులు మాఱుటం బట్టి, మానవుల బుద్ధీంద్రియ పాటవంబు లంత కంతకు సన్నగిల్లి, రాజకీయాందోళనా శృంఖల పరంపరలచేఁ గట్టువడి తృప్తి సనక కృత్రిమ సౌందర్యావలోకన మోహ పారవశ్యులై ప్రాచీన సంప్రదాయంబులఁ గేవలము విసర్జించిరి.

అక్కారణంబున నా యనాథ కవితా కుమారికకు శరణం బొసంగు తగిన వరుండు లభింపమికి, యింతకాలం బెట్టులో కాలముఁ గడుపవలసివచ్చె. అంతఁ గొండొకనాఁడు నా శిష్యుం డగు శ్రీయుత ఎడ్లపల్లి సాముయేలు కవి నన్ను దర్శించి గ్రంథ విషయ మామూలాగ్రముగఁ బ్రశ్నించి "శ్రీ కాళ్ళూరు వారి ధర్మ సంస్థాన విధానంబు నాతో విన్నవించి, మీ రవశ్యంబ శ్రీవారి సంస్థానము దర్శించిన మీ కోరిక లన్నియు కొనసాగ గల వని" నాతో సవినయముగ వచించె.

అంత సంతసించి నే నట కేఁగి, శ్రీవారిని మద్గ్రంథ మాధురీ మహిమార్ణవ వీచికా డోలికల నూగించితి. అంత వమం దానందాతిశయంబునఁ దొప్పదోఁగి, కృతిని స్వీకరించి మాన్యం బును, పట్టుపీతాంబరంబుల బహూకరించి, నన్నానంద భరి తాంతఃకరణునిగ నొనర్చిన రాజపూజితులును, వదాన్య శేఖరులు

గావించుచుండు నాకాశవీథి" "చందమామకు నీకు సంబంధ మెట్లని ముసలమ్మ కడకేగి ముచ్చటించు" ఈ చరణములు జాషువా కవియందలి యభిమానమును జాటుచున్నవి. ఈ రెండు చరణములతో నాయన గౌరవ మాయనకుఁ జెల్లించి తన సొంత పోకడ తాను మొదలుపెట్టెను.

భారవిలో కవిలక్షణములు ౨ మొదలు ౧౦వ పద్యము వఱకు వ్రాసినవ్రాఁత సౌకుమార్యములోఁ బ్రౌఢి జతపఱచి పేలవము కాని వీథుల విహరించుచున్నది. దీనివలన నీ కవి యొక్క పద్య రచనాసామర్థ్యము విశద మగును. ఈ శక్తి ప్రకటించిన తరువాత కవి తన క్రొత్త శక్తులు చూప నారంభించెను. "ప్రౌఢవాఙ్మయకావ్యపర్వతంబుల నుండి రసము పిండిన విమర్శకులతోడ" ఈ పాదమునం దీ కవికి,నితరులకుఁగల భేదము తెలియును. ప్రౌఢ వాఙ్మయ కావ్యములు పర్వతములఁట. విమర్శకులు వానినుండి రసము పిండుదు రట. ఈయన మనస్సులో పాండిత్యము పై నెంత మొగ్గున్నదో చూడవచ్చును.

ఇతఁడు పైపై మెఱుఁగులకవి కాదు. హృదయ సూక్ష్మ విషయములు, దివ్యార్థములు — వానిని స్పృశించు కవి భారవి తన తల్లితోఁ దండ్రిని గుఱించిన కోపము చెప్పుచుండగా 'ప్రజ్ఞావహమైనచిత్తమువిచారముతోఁ బగ విన్నవించె గ్రోధావిల మానసుం డగుచు." కోపముచేత నతని ప్రజ్ఞయుం తయు లోపించెను. 'పండితాగ్రణియు నయ్యు నపండితు నట్లు వాగెను.' అంతటఁ దల్లి 'యయ్యనఘుని కేల నీపయి ననార్యహితం బగు నీర్ష్య కల్గు' అనెను. ఈర్ష్య అనార్యహిత మనట